తే. ఒగిఁజిదాకాశుఁడవువన్యయూఁడవొకఁడవు అచలుఁడవుశాంతుఁడవునునీయందు నెన్న
ఎట్టులగుఁబుట్టువుపనిచే పట్టుపెట్టు । లెట్టులొప్పునహంకార మిఁకదియును 192

14శ్లో॥ యత్త్వంపశ్యసితత్రైక । స్త్వమేవప్రతిభాససే
కింపృథక్భాసతేస్వర్ణా। త్కటకాంగదనూపురం॥

ఆ. ఎంచిచూడనెద్ది యీవుకన్గొందువో । అదనీవొకఁడవె హైయులరదు
కటకమంగదంబు ఘననూపురంబును । స్వర్ణమునవువేఱు సరణిఁదగునె? 193

15శ్లో॥ అయంసోహమయంనాహం । విభాగమితిసంత్యజ
సర్వమాత్మేతినిశ్చిత్య । నిస్సంకల్పస్సుఖీభవ॥

ఆ. ఇద్దియగుదునేనె యిదియేనుగానను । నట్టియేరుపాటు పుట్టుపెట్టి
సకలమాత్మయెయును సత్యమ్మునెఱినమ్మి । తలఁపుమానిసౌఖ్యదళవహింపు 194

16శ్లో॥ తవైవాజ్ఞానతోవిశ్వం । త్వమేకఃపరమార్థతః
త్వత్తోన్యోనాస్తిసంసారీ । నాసంసారీచకశ్చన॥

ఆ. నీకునెఱుకలేమి నిఖిలజగంబొప్పు । ఉన్నవివరమెన్న నొకఁడవీవె
నిజముపరుఁడులేఁడు నీకంటెసంసారి । అట్టుకానివాఁడ టంచునున్నె? 195

17శ్లో॥ భ్రాంతిమాత్రమిదంవిశ్వం । నకించిదితినిశ్చయీ
నిర్వాసనస్స్ఫూర్తిమాత్రో। నకించిదివశామ్యతి॥

ఆ. భ్రమయెకానిలేదు పరికింపనీజగం । బించుకేనటంచు నెంచునీవు
వాసనారహితుఁడ వగుస్ఫూర్తిమాత్రుఁడ । వేమిలేనియట్టు లెళమించు 196

18శ్లో॥ ఏకఏవభవాంభోధా । వాసీదస్తిభవిష్యతి
నతేబంధోస్తిమోక్షోవా । కృతకృత్యస్సుఖంచర॥

ఆ. మున్నిపుడునుమీఁద నన్నిజన్మములన్న । గొప్పవార్థినొకఁడవొప్పదప్ప
బంధమోక్షములనఁ బడునవేనీకులే । వఁగృతార్థుఁడవుర హాయిమెలఁగు 197

19శ్లో॥ మాసంకల్పవికల్పాభ్యాం । చిత్తంక్షోభయచిన్మయ
ఉపశామ్యసుఖంతిష్ఠ । స్వాత్మన్యానందవిగ్రహే॥

ఆ. ఓయిచిన్మయుండ నీయొప్పుచిత్తముం । దలఁపువిఱుపుడంలకుఁ గలవఱపకు
హర్షవిగ్రహమగు నాత్మస్వరూపమం । దుపశమించిసౌఖ్య మొప్పనిలుమి 198

20శ్లో॥ త్యజైవధ్యానంసర్వత్ర । మాకించిద్ధృదిధారయ
ఆత్మాత్వంముక్తఏవాసి । కింవిమృశ్యకరిష్యసి॥

ఆ. ఎల్లయెడలధ్యాన మింతయుఁజేయకు । మించుకైన నెడఁద నుంచకు మది
ఆత్మవీవెయగుట నగుదువుముక్తుండ । వీవిమర్శనమున నేమొనర్తు? 199

## షో డ శ ప్ర క ర ణ ము.

## వి శే షో ప దే శ ము.

1శ్లో॥ ఆచక్ష్వ శృణు వా తాత । నానాశాస్త్రాణ్యనేకశః
తథాపి న తవ స్వాస్థ్యం । సర్వవిస్మరణాదృతే॥

ఆ. చెప్పుమప్పవినుము చెప్పంగనెన్నియో । మాఱ్లు పెక్కు శాస్త్ర మర్మములను
అట్టులైననీకు సమరదుస్వస్థత । మఱవమేలుసుమ్మి గుఱుతునమ్మి. 200

2శ్లో॥ భోగం కర్మ సమాధిం వా । కురు విజ్ఞ తథాపి తే
చిత్తం నిరస్తసర్వాశ । మత్యర్థం రోచయిష్యతి॥

ఆ. జ్ఞానమహితభోగ కర్మములుసమాధి । చేయుమైననీదు చిత్తమెన్న
ఆసలన్ని పాసి యతిరుచిపరమార్థ । మందు వెదకుఁ దాని నందుఁదుదకు. 201

3శ్లో॥ ఆయాసాత్సకలో దుఃఖీ । నైనం జానాతి కశ్చన
అనేనైవోపదేశేన । ధన్యః ప్రాప్నోతి నిర్వృతిం॥

ఆ. అఖిలదుఃఖచయము నాయాసమునఁ బొందుఁ । గాని తాను దానిఁ గానఁ డౌను
ఒప్పనైనయిట్టి యుపదేశమబ్బిన । ధన్యుఁడనుగల్గుఁ దనరుముక్తి. 202

4శ్లో॥ వ్యాపారే ఖిద్యతే యస్తు । నిమేషోన్మేషయోరపి
తస్యాలస్యధురీణస్య । సుఖం నాన్యస్య కస్యచిత్॥

తే. ఱెప్పవాలుపలేపనా నప్పనికిని । ఎవ్వఁడాసక్తిలేకుండు నెపుడునలసి
ఈక్రియాభినివేశరహితుఁడుగాక । యింకనేనికిసుఖముండ దెన్నటికిని. 203

5శ్లో॥ ఇదం కృతమిదం నేతి । ద్వంద్వైర్ముక్తం యదా మనః
ధర్మార్థకామమోక్షేషు । నిరపేక్షం తదా భవేత్॥

ఆ. ఇద్దిచేయనైన దిదికాదటంచునీ । ద్వంద్వముడిగియెపుడు తగునొమనము
అపుడెకలుగునుబురుషార్థచతుష్టయ । మందపేక్షలేమి యడ్డఁగేమి? 204

6శ్లో॥ విరక్తో విషయద్వేష్టా । రాగీ విషయలోలుపః
గ్రహమోక్షవిహీనస్తు । న విరక్తో న రాగవాన్॥

ఆ. విషయములనుఁ రోయు వేత్తయగు విరాగి । విషయకాంక్షువాఁడు పెద్దరాగి
బంధమోక్షములను పాసినమహితుండు । కాఁడు తావిరాగి కాఁడు రాగి. 205

7శ్లో॥ హేయోపాదేయతాతావ । త్సంసారవిటపాంకురః
స్పృహాజీవతియావద్వై । నిర్విచారదశాస్పదం॥

ఆ. సహ్యమునసహ్య సరణులుసంసార । వృక్షమునకు మొలక విత్తనములు
ఎంత కావివేక హీనహేతుస్పృహ । యుండునంతకల్ల రెండునుండు. 206

8శ్లో॥ ప్రవృత్తౌజాయతేరాగో । నివృత్తౌద్వేషఏవహి
నిర్ద్వంద్వోబాలవద్ధీమా । నేవమేవవ్యవస్థితః॥

ఆ. వర్తనంబునందు వరలెడిరాగంబు । తీఱనైననొదవు ద్వేషమార
ఇట్టిరెండులేని దిట్టయాధీశాలి । బాలుఁబోలిలీలఁ గ్రాలునోలి. 207

9శ్లో॥ హాతుమిచ్ఛతిసంసారం । రాగీదుఃఖజిహాసయా
వీతరాగోహినిర్దుఃఖ । తస్మిన్నపినఖిద్యతి॥

ఆ. రాగిచింతవలని రాయిడిసంసార । ముడుగనిచ్ఛగించు చుండుఁగాని
వీతరాగిచింత చేతయెఱుంగమి । దానిమానఁడాని దానమాన. 208

10శ్లో॥ యస్యాభిమానోమోక్షేపి । దేహేపిమమతాతథా
నచజ్ఞానీనవాయోగీ కేవలందుఃఖభాగసా॥

ఆ. ముందుదేహమందు మోక్షంబునను వెన్క । మమతయుమతియుఁనభిమానమున్న
కాఁడువాఁడుజ్ఞాని కాఁడురాయోగియు । దుఃఖభూజమునకు దుంపవాఁడె.209

11శ్లో॥ హరోయద్యుపదేష్టాతే । హరిఃకమలజోపివా
తథాపినతవస్వాస్థ్యం । సర్వవిస్మరణాదృతే॥

తే. ఉండునదియెల్ల మఱచున ట్టొదవుఁగాని । కమలగర్భుండువిష్ణుండుఁగాలగళుఁడు
కూడెనాస్థనుబోధించు గురువులైనఁ । గూడనీకల్ల స్వస్థత కుదురదుసుమి. 210

సప్తదశ ప్రకరణము.

తత్త్వజ్ఞ స్వరూప వింశతికము.

1శ్లో॥ తేనజ్ఞానఫలంప్రాప్తం । యోగాభ్యాసఫలంతథా ।
తృప్తస్స్వచ్ఛేంద్రియోనిత్య । మేకాకీరమతేతుయః॥

ఆ. ఎవఁడుతృప్తుఁడువిజితేంద్రియుఁడేకాకి । యైయనారతంబు నలరునట్టి
వానికబ్బుజ్ఞాన ఫలముయోగాభ్యాస । ఫలముఁదదితరునకుఁ గలుగు నెట్టు? 211

2శ్లో॥ నకదాచిజ్జగత్యస్మి । న్తత్త్వజ్ఞోహంతఖిద్యతి
యతఏకేనతేనేదం । పూర్ణంబ్రహ్మాండమండలం॥

ఆ. అహహాయీజగంబు నందెప్పుడేనొక్క । తత్త్వవేత్తచింత తానెఱుఁగఁడు
పరఁగునతనిచేత బ్రహ్మాండమండల । మ్ముందునిండిదండి యుండసుండి. 212

3 శ్లో॥ నజాతువిషయాః కేపి । స్వారామంహర్షయంత్యమీ
సల్లకీపల్లవప్రీత । మివేభంనింబపల్లవాః॥

ఆ. ఆత్మ మెఱుఁగుయోగి యానంద మొందునే । విషయసౌఖ్యములనువిడుచుఁగాక
అందుగులచివుళ్ల నారగించెడియేన్గు । తినునె వేఁపచుండ లనుభారపడి? 213

4 శ్లో॥ యస్తుభోగేషుభుక్తేషు । నభవత్యధివాసితా
అభుక్తేషునిరాకాంక్షీ । తాదృశోభవదుర్లభః॥

ఆ. ఎవ్వఁడైననుభవించితాఁదనిసియు । నింకనద్దికోరనెన్నఁడతఁడు
ననుభవింపకుండి తనిసెడియాతండుఁ । గోటికొక్కఁడైనఁగుదురునొక్క.214

5 శ్లో॥ బుభుక్షురిహసంసారే । ముముక్షురపిదృశ్యతే
భోగమోక్షనిరాకాంక్షీ । విరలోహిమహాశయః॥

ఆ. మోక్షకామియుండు భోగేచ్ఛసంసార । మందుఁగానసైన యతఁడునుండు
భోగమోక్షవాంఛఁ బూననియామహా । శయుఁడెదుర్లభుండు జగతినరయ. 215

6 శ్లో॥ ధర్మార్థకామమోక్షేషు । జీవితేమరణేతథా
కస్యాప్యుదారచిత్తస్య । హేయోపాదేయతానహి॥

తే. ఎన్నసైనచిత్తౌదార్య మెవనికున్న । సహ్యమీయదియయ్యద సహ్యమగునె?
కడఁగుధర్మార్థకామమోక్షములయెడలఁ । మనికియెడనింకమరణంబుఁగనుసెడనిల

7 శ్లో॥ వాంఛానవిశ్వవిలయే । నద్వేషస్తస్యచస్థితౌ
యథాజీవికయాతస్మా । ద్ధన్యఆస్తేయథాసుఖం॥

తే. విశ్వమెల్లనశింపన పేక్షలేదు । అద్ది యున్నప్డుద్వేషము నట్లెలేదు
ప్రాప్తజీవనమునఁదానుబరగుచుండు । ధన్యుఁడెపుడునుదగు సౌఖ్యతనువహించు

8 శ్లో॥ కృతార్థో౽నేనజ్ఞానేనే । త్యేవంగళితధీఃకృతీ
పశ్యన్శృణ్వన్స్పృశన్జిఘ్ర । న్నశ్నన్నాస్తేయథాసుఖం॥

తే. ఇట్టితెలివిఁగృతార్థుఁడ నేననుకొని । తాగళితబుద్ధియైనట్టి ధన్యుఁడరయఁ
గనెడువినియెడుఁదాకుమూర్కొనెడుఁదినెడు । నందుచుండునుదగు సౌఖ్యమనవరతము.

9 శ్లో॥ శూన్యాదృష్టిర్వృథాచేష్టా । వికలానీంద్రియాణిచ
నస్పృహానవిరక్తిర్వా । క్షీణసంసారసాగరే॥

తే. శూన్యశూదృష్టిచేష్టలు నూడవృథలు । ఇంద్రియములెల్ల వికలంబు లెంచిచూడ
లేదుస్పృహయువిరక్తియు లేదుసాగ । లోపమంబగుసంసార రుచినిరోయ. 219

10శ్లో॥ నజాగర్తిననిద్రాతి । నోన్మీలతినమీలతి
అహోపరదశాక్వాపి । వర్తతేముక్తచేతసః॥

తే. అహాహాయుత్కృష్టదశయదేమనఁగవచ్చు। చెలఁగుముక్తుఁడువర్తించుఁజిత్రములను
మేలుకొనఁడెన్న నిద్రింప వీలరయఁడు । ఱెప్పవాలుపఁడెత్తండె యొప్పటికిని.

11శ్లో॥ సర్వత్రదృశ్యతేస్వస్థ । స్సర్వత్రవిమలాశయః
సమస్తవాసనాముక్తో । ముక్తస్సర్వత్రరాజతే॥

తే. సర్వకాలముఁగాన్పించు స్వస్థుఁడైయె । అన్నియెడలనుసమదర్శియైయెసంగు
విషయవాసనలెల్లను వీడియుండు । ముక్తుఁడెల్లెడరాణించు ముద్దుగాను. 221

12శ్లో॥ పశ్యన్ఛృణ్వన్స్పృశన్జిఘ్రు । న్నశ్నన్గృహ్ణన్వదన్వ్రజన్
ఈహితానీహితైర్ముక్తో । ముక్తఏవమహాశయః॥

తే.కనుచువినుచుండియంటిమూర్కొనుచునుండి। తినుచుఁగొనుచుండిపలుకుచుఁజనుచునుండి
వలయునదియొల్లనిదిలేక వరలుచుండు । ఆత్మఁగనుమహితుఁడు ముక్తుఁడైనకతన.222

13శ్లో॥ ననిందతినచస్తౌతి । నహృష్యతినకుప్యతి
నదదాతినగృహ్ణాతి । ముక్తస్సర్వత్రనీరసః॥

తే. చేయఁడేనిందస్తోత్రంబు చేయఁడెవని । పొందఁడానందమునుగోపమందఁడెపుడు
ఈయఁబోఁడిచ్చునదికొన నీయకొనఁడు । నీరసములన్నిముక్తునికారయంగ.223

14శ్లో॥ సానురాగాంస్త్రియందృష్ట్వా । మృత్యుంవాసముపస్థితం
అవిహ్వలమనాస్స్వస్థో । ముక్తఏవమహాశయః॥

తే. చూడననురాగవతియైన సుందరాంగి । మనసుఁజెదరంగనీయండు తనదరిఁదగు
మరణదేవతఁగన్నఁగు దిరికచెడఁడు । ఆత్మఁగనుమహితుఁడుముక్తుఁడైనకతన.

15శ్లో॥ సుఖేదుఃఖేనరేనార్యాం । సంపత్సుచవిపత్సుచ
విశేషోనైవధీరస్య । సర్వత్రసమదర్శినః॥

తే. అన్నియెడలనుసమదర్శి యైనధీర । వరునకేలవిశేషంబు లెఱుకపడును?
ఖేదనానందములస్త్రీపురుషులయెడల । సంపదలపట్లనాపలా సమయములను.

16శ్లో॥ నహింసానైవకారుణ్యం । నౌద్ధత్యంనచదీనతా
నాశ్చర్యంనైవచక్షోభః । క్షీణసంసరణేనరే॥

తే. లేదుకరుణాకారసంబట్టై లేదుహింస । లేదుదైన్యంబుగర్వము లేదుకూడ
లేదుసంక్షోభమునువింత లేదుకాద । గళితసంసారియైనయాఘునుకెపుడు. 226

17శ్లో॥ నముక్తోవిషయద్వేష్టా । నవావిషయలోలుపః
అసంసక్తమనానిత్యం । ప్రాప్తప్రాప్తముపాశ్నుతే॥

తే. విషయదూరుఁడుకాఁడట్టె విషయపరుఁడు । దేనిఁగూడఁడువీడఁడు దేనిఁగూడ
ఏదిప్రాప్తించుదానికేమోదమందు।ముక్తుఁడైయొప్పుమహాత్మమూర్తియున్న

18శ్లో॥ సమాధానాసమాధాన । హితాహితవికల్పనాః
శూన్యచిత్తోనజానాతి । కైవల్యమివసంస్థితః॥

తే. ఒప్పునదియంచునెఱుఁగఁడట్లొప్పనిదని । హితముకానిదియెఱుఁగండుహితమెఱుగఁడు
వరలుజ్ఞానివిదేహకైవల్యమంది । యున్నలాగునఁగనవచ్చు సన్నుఁదెలియ. 228

19శ్లో॥ నిర్మమోనిరహంకారో । నకించిదితినిశ్చితః
అంతర్గళితసర్వాశః । కుర్వన్నపికరోతిన॥

తే. లోననేయాసయునులేని జ్ఞానియరయ । మమతనాడ్చియహంకృతి మంటఁగలిపి
ఏమియునులేనిదనినిశ్చయించికొనియుఁ।జేయుఁబనులనుఫలముఁదాఁజెందకుండు.

20శ్లో॥ మనఃప్రకాశసమ్మోహ । స్వప్నజాడ్యవివర్జితః
దశాంకామపిసంప్రాప్తో । భవేద్గళితమానసః॥

తే. స్వప్నజాడ్యములనుప్రకాశమునుమోహ । ముడిగియునుదెప్పటిలుమదియొప్పునతఁడు
ఎద్దియేనొకదశలటస్థిఁచినంత । గళితమానసుఁడైమర్మములనెఱిఁగెడి. 230

అష్టాదశ ప్రకరణము.

శాంతి శతకము.

1శ్లో॥ యస్యబోధోదయేతావ । త్స్వప్నవద్భవతిభ్రమః
తస్మైసుఖైకరూపాయ । నమశ్శాంతాయతేజసే॥

తే. ఏనికేజ్ఞానముదయించు నెప్పటికినో । అంతదనుకనుభ్రమస్వప్న మట్టులుండు
అట్టిసుఖరూపమునుశాంత మైనయట్టి । తేజమునకేను మ్రొక్కుదుఁ దృప్తితీఱ.

2శ్లో॥ అర్జయిత్వాఖిలానర్థా । న్భోగానాప్నోతిపుష్కలాన్
నహిసర్వపరిత్యాగ । మంతరేణసుఖీభవేత్॥

తే. ధనముసార్జించిరొల్లవి ధనములనరుఁడు । భోగములువిస్తరించియోపొందుచుండు
వానినన్నింటిఁద్యజియించు మానవునికిఁ । గానిసుఖమబ్బనేరదు కాదెతెలియ?

3శ్లో॥ కర్తవ్యదుఃఖమార్తండ । జ్వాలాదగ్ధాంతరాత్మనః
కుతః ప్రశమపీయూష । ధారాసారమృతేసుఖం॥

ఆ. కర్మజనితదుఃఖ ఘనరవిదీధితి । చేవిదగ్ధుఁడైన జీవికన్న
శాంతమనెడియమృత సారపుధారతోఁ । జిక్కకున్నసుఖము దక్కునొక్కొ!

4శ్లో॥ భవోఽయంభావనామాత్రో । నకించిత్పరమార్థతః
నాస్త్యభావస్స్వభావానాం । భావాభావవిభావినాం॥

తే. పరగుసంకల్పమాత్రమై భవముజగతి । నాత్మయేభావరూపమై యలరఁగాన
భావతదభావగతసుస్వభావములకు । లేదభావముచల్లన కాదువహ్ని. 234

5శ్లో॥ నదూరంనచసంకోచా । ల్లబ్ధమేవాత్మనఃపదం
నిర్వికల్పంనిరాయాసం । నిర్వికారంనిరంజనం॥

ఆ. ఆత్మయొక్కరూప మగులబ్ధమదిదూర । మనను రాదుచేరు వనను రాదు
అగునునిర్వికల్పమగు నిరాయాసంబు । నగునునిర్వికృతిని రంజనంబు.

6శ్లో॥ వ్యామోహమాత్రవిరతౌ । స్వరూపాదానమాత్రతః
వీతశోకావిరాజంతే । నిరావరణదృష్టయః॥

ఆ. ఆన్నికనెడిజ్ఞాను లాత్మవిశ్రాంతిచేఁ । దెలిసిమోహమడఁచి తెన్నెఱింగి
వీతశోకులగుచు వెలుగొందుదురుభువి । వారితీరుఁ కేరు లేరుగారె? 236

7శ్లో॥ సమస్తంకల్పనామాత్ర । మాత్మాముక్తస్సనాతనః
ఇతివిజ్ఞాయధీరోహి । కిమభ్యస్యతిబాలవత్॥

ఆ. కలప్రపంచమెల్లఁ గల్పనామాత్రమై । ముఖ్యమైనయాత్మ ముక్తుఁడేకద
అనుచుఁదెలిసిజ్ఞాని యర్భకునట్టుల । నలవఱచికొనండె యంతయింత? 237

8శ్లో॥ ఆత్మాబ్రహ్మేతినిశ్చిత్య । భావాభావౌచకల్పితౌ
నిష్కామఃకింవిజానాతి । కింబ్రూతేచకరోతికిం॥

ఆ. తానుబ్రహ్మమనచుఁ దగుకలిమియులేమి । కల్పితములటంచుఁ గనెడుజ్ఞాని
ఏమితెలియఁగోరు నేమనఁగాఁగోరు । నేమిపనులొనర్ప నిచ్చగించు? 238

9శ్లో॥ అయంసోఽహమయంనాహం । మితిక్షీణావికల్పనాః
సర్వమాత్మేతినిశ్చిత్య । తూష్ణీంభూతస్యయోగినః॥

ఆ. తానెసర్వమంచుఁ దథ్యంబుగణియించు । చూరకుండుయోగి సేరకుండు
అద్దినేనుగానిఁ కిద్దియేనేనని । పలుకనైనహీన భావవిధులు 239

10శ్లో॥ నవిక్షేపోనచైకాగ్ర్యం । నాతిబోధోనమూఢతా
నసుఖంనచవాదుఃఖ । ముపశాంతస్యయోగినః॥

• తే. తనకువ్యగ్రతయేకాగ్రతయును లేదు । చెలఁగు తెలివియుమౌఢ్యము కలిమిలేదు
కడకుసౌఖ్యముమఱియుదుఃఖంబులేదు। ఉపశమముకల్గియొప్పెడియోగికరయ240

11శ్లో॥ స్వారాజ్యేభైక్ష్యవృత్తౌచ । లాభాలాభేజనేవనే
నిర్వికల్పస్వభావస్య । నవిశేషోస్తియోగినః॥

తే. నిర్వికల్పస్వభావుఁడై నెగడుయోగి । కరయనింద్రపదవియుభైక్ష్యమ్మునొకటె
లాభదాలాభదార్థపు లాగులొకటె ।జనసమితియందువనమందునునికియొకటె241

12శ్లో॥ క్వధర్మఃక్వచవాకామః । క్వచార్థఃక్వవివేకతా
ఇదంకృతమిదంనేతి । ద్వంద్వైర్ముక్తస్యయోగినః॥

ఆ. ఇదియెచేయఁదగిన దిద్దికాదనునట్టి । రెండులేకసమత నుండుయోగి
యేమెఱుంగుధర్మకామంబులర్థంబు । తెలివిమోక్షమునకుఁ దెన్నుచూప? 242

13శ్లో॥ కృత్యంకిమపినైవాస్తి । నకాపిహృదిరంజనా
యథాజీవనమేవేహ। జీవన్ముక్తస్యయోగినః॥

తే. అవనిఁదానుజీవన్ముక్తుఁడైనయోగి । యెట్లుదృష్టమొయట్లెజీవించుఁగాని
చేయఁదగినదియనియొక చెయ్వెఱుఁగఁడు। దేనమానసమనురాగ మూననీఁడు243

14శ్లో॥ క్వమోహఃక్వచవావిశ్వం । క్వతద్ధ్యానంక్వముక్తతా
సర్వసంకల్పసీమాయాం । విశ్రాంతస్యమహాత్మనః॥

ఆ. శాంతుఁడగుచుబుద్ధి సంకల్పములయందు । భ్రాంతిలేనియోగి వర్యునకును
వినఁగమోహమేడ? విశ్వంబనఁగనేడ? । మొదలధ్యానమేడ? ముక్తియేడ? 244

15శ్లో॥ యేనవిశ్వమిదందృష్టం । సనాస్తీతికరోతువై
నిర్వాసనఃకింకురుతే । పశ్యన్నపినపశ్యతి॥

ఆ. ఎవ్వఁడీజగంబు నెల్లఁదాఁగనుచుండు । వాఁడెయెఱుఁగులేని జాడనొకట
నిశ్చయంబెఱుంగు నిర్వాసనుండైనఁ । జూచునట్టెయుండుఁ జూడకుండు 245

16శ్లో॥ యేనదృష్టంపరంబ్రహ్మ । సోహంబ్రహ్మేతిచింతయేత్
కించింతయతినిశ్చింతో। ద్వితీయంయోనపశ్యతి॥

•తే. ఎవఁడుబ్రహ్మముఁగనునొతా నేనెబ్రహ్మ । మనికొనంగలయూహనే యంగలందు
రెండవదెయున్నఁడుంగాన కుండుజ్ఞాని। తలఁపెఱుంగఁడేయేమిచింతలనొనర్చు?246

17శ్లో॥ దృష్టోయేనాత్మవిక్షేపో । నిరోధంకురుతేత్వసౌ
ఉదారస్తు నవిక్షిప్త । స్సాధ్యాభావాత్కరోతికిం॥

తే. ఎవఁడుచింతలభ్రాంతిని దవులునతఁడు । నలిగిచిత్తనిరోధము నర్చుచుండు
తానుదారుఁడుభ్రాంతినే తగులకునికిఁ । దివిరికనఁబనిలేదుసాధింతమన్న. 247

18శ్లో॥ ధీరోలోకవిపర్యస్థో । వర్తమానోపిలోకవత్
నసమాధింనవిక్షేపం । నలేపంస్వస్యపశ్యతి॥

తే. లోకవిపరీతుఁడగుజ్ఞాని లోకమట్టు । వర్తనంబునఁబ్రాగ్బద్ధ వశతనున్న
అలసమాధియువిక్షేప మల్లలేప । మరయఁదనవిగఁగనుగొన నైనఁబోఁడు. 248

19శ్లో॥ భావాభావవిహీనోయ । స్తృప్తోసర్వాసనోబుధః
నైవకించిత్కృతంతేన । లోకదృష్ట్యావికుర్వతా॥

తే. ఏబుధుఁడుభావతదభావ హీనుఁడైయుఁ । దృప్తుఁడైభ్రాంతులేవియు నెఱుఁగఁడాతఁ
డింతయేలోకదృష్టిఁగా వించెనేని । దానినొకపనిఁగాలెక్క కూనరాదు. 249

20శ్లో॥ ప్రవృత్తౌవానివృత్తౌవా । నైవధీరస్యదుర్గ్రహః
యదాయత్కర్తుమాయాతి । తత్కృత్వాతిష్ఠతస్సుఖం॥

తే. పనులనొవరింపనవిమాను పట్లజ్ఞాని । యైనవానికిలేదభిమానమెపుడు
ఎప్పుడేయదికావింప నేరుపడునొ । యప్పుడదిచేసిసుఖముగా నధివసించు. 250

21శ్లో॥ నిర్వాసనోనిరాలంబః । స్వచ్ఛందోముక్తబంధనః
క్షిప్తస్సంసారవాతేన । చేష్టతేశుష్కపర్ణవత్ ॥

తే. భ్రమయుఁబనులఁబ్రవర్తనవానిప్రీతి । యెదియులేకుండిబంధన మేదెఱుఁగని
జ్ఞానిసంస్కారమనుగాలి పూనగుట । నెండినాఁకుగవర్తించు చుండునహహ! 251

22శ్లో॥ అసంసారస్యతుక్వాపి । నహర్షోనవిషాదతా
సశీతలమనానిత్యం । విదేహఇవరాజతే॥

తే. అల్లసంసారమంటని యట్టిజ్ఞాని । యెఱుఁగడానందమును ఖేద మేదఁగాని
చల్లనగుమానసంబున నెల్లయెడలఁ । దేజరిల్లుచునుండువి దేహుపగిది 252

23శ్లో॥ కుత్రాపినజిహాసాస్తి । నాశోవాపినకుత్రచిత్
ఆత్మారామస్యధీరస్య । శీతలాచ్ఛతరాత్మనః॥

తే. ఆత్మమ భిరాము మైయుండు నట్టిధీర । మతికివార్ధ్రాలినిర్మల మానసునకు
పట్టువిడుపులయందిచ్ఛ పుట్టదెచట । రాదునాశనమునునన ర్థంబునెచట 253

24శ్లో॥ ప్రకృత్యాశూన్యచిత్తస్య । కుర్వతోఽస్యయదృచ్ఛయా
ప్రాకృతస్యేవధీరస్య । నమానోనావమానతా॥

తే. వృత్తిలేకుండుచిత్తము వెలయుజ్ఞాని । పూనుప్రారబ్ధమునఁబెయ జ్ఞానియట్లు
లేదియెట్టులఁజేయఁగా నేరుపడిన । మానమవమానమూనఁడు మానసమున. 254

25శ్లో॥ కృతందేహేనకర్మేదం । నమయాశుద్ధరూపిణా
ఇతిచింతానురోధీయః । కుర్వన్నపికరోతిన॥

తే. ఈపనులుసేతమేనున నేరుపడియెఁ । గానియమలస్వరూపినా నేనొనర్ప
ననుచుయోజించుజ్ఞానియేఁడాతఁడెప్పు । డేదిచేసియుఁజేయఁగలేదనఁబడు.255

26శ్లో॥ అతద్వాదీవకురుతే । నభవేదపిబాలిశః
జీవన్ముక్తస్సుఖీశ్రీమా । న్సంసరన్నపిశోభతే॥

తే. అరయఁబనులుజీవన్ముక్తుఁడైనజ్ఞాని । యేనచేయుదుననువాని మైనొనర్ప
సాగిమూర్ఖుఁడుగాఁడుసంసారియైయు । సుఖియుశ్రీమంతుఁడనఁదగుశోభనొందు

27శ్లో॥ నానావిచారసుశ్రాంతో । ధీరోవిశ్రాంతిమాగతః
నకల్పతేనజానాతి । నశృణోతినపశ్యతి॥

తే. చాలగాద్వైతభావవిచారములను । జేసిడస్సియువిశ్రాంతిఁజెందుజ్ఞాని
యిప్పుడూహింపఁదెలిసికోనెన్నఁడౌర । వినఁగఁగనఁగనుదలఁపండె వింతగాను

28శ్లో॥ అసమాధేరవిక్షేపా । న్నముముక్షుర్నచేతరః
నిశ్చిత్యకల్పితంపశ్య । న్బ్రహ్మైవాస్తేమహాశయః॥

తే. జ్ఞానిముక్తుండుబద్ధుండుఁ గాఁడుసుమ్మి • అలసమాధియుద్వైతభ్రమాశిలేమి
ఇద్దిసర్వమునిత్యమం చెఱుఁగుకతన । నిర్వికారుఁడుబ్రహ్మమై నెగడుజగతి.258

29శ్లో॥ యస్యాంతస్స్యాదహంకారో । నకరోతికరోతిసః
నిరహంకారధీరేణ । నకించిదకృతంకృతం॥

తే. ఏనిహృదిలోనహంకృతి పూనువాఁడు । చేయకుండినఁజేసిన ట్లేయగపడు
తానహంకారమూనని జ్ఞానియైనఁ । జేయునదియించుకయు లేకచేయునిదగు.259

30శ్లో॥ నోద్విగ్నంనచసంతుష్ట । మకర్తృస్పందవర్జితమ్
నిరాశంగతసందేహం । చిత్తంముక్తస్యరాజతే॥

తే. ముక్తుఁడగుజ్ఞానిచిత్తము ముదమెఱుఁగక । కోపమొందకకదఁగక కుదురువిడక
ఆసఁజెందకసందేహ మైనలేక । సర్వదాతేజరిల్లుస సారముగను. 260

31 శ్లో॥ నిర్ధ్యాతుంచేష్టితుంవాపి । యచ్చిత్తంనప్రవర్తతే
నిర్ణిమిత్తమిదంకింతు । నిర్ధ్యాయతివిచేష్టతే॥

తే. ఏపనియు మానఁబనిసేయ నెవనిచిత్త । మొగిఁ బ్రవర్తింపదాజ్ఞాని కూహలేమి
నిశ్చలత్వమె యెల్లెడ నెగడుచుండుఁ । జేష్టలొనరించు నొకవేళఁ జిత్రముగను.261

32 శ్లో॥ తత్త్వంయథార్థమాకర్ణ్య । మందఃప్రాప్నోతిమూఢతాం
అథవాయాతిసంకోచ । మమూఢఃకోపిమూఢవత్॥

తే. నిక్కమౌ తత్త్వ మొక్కటఁ జక్కఁగ విని । మందుఁ డజ్ఞానిమౌఢ్యము నొందును మఱి
ధ్యానమూనును శాస్త్రగాథలను వినికి । నవివేకియె మూఢునట్లె యొదఁబడు.262

33 శ్లో॥ ఏకాగ్రతానిరోధోవా । మూఢైరభ్యస్యతేభృశం
ధీరాఃకృత్యన్నపశ్యంతి । సుప్తవత్స్వపదేస్థితాః॥

తే. అల్లగుఱిచూపొ చిత్తమునాచికొలొ । మూఢులభ్యాసమొనరింత్రు మొగిమిగులను
స్వస్వరూపులు జ్ఞానులే పనులుఁగనరు । కలలెఱుంగని నిద్రితు కరణిధరణి. 263

34 శ్లో॥ అప్రయత్నాత్ప్రయత్నాద్వా । మూఢోనాప్నోతినిర్వృతిం
తత్త్వనిశ్చయమాత్రేణ । ప్రాజ్ఞోభవతినిర్వృతః॥

మూఢుఁడగువాఁడు నిర్వృతిఁ బొందలేఁడు । చేసియత్నము యత్నము చేయకయును
మహితమగు తత్త్వమెఱిఁగిన మాత్రముననె । నిర్వృతుండగుఁ బ్రాజ్ఞుఁడు నిశ్చయముగ.

35 శ్లో॥ శుద్ధంబుద్ధంప్రియంపూర్ణం । నిఃప్రపంచంనిరామయం
ఆత్మానంతంనజానంతి । తత్రాభ్యాసపరాజనాః॥

తే. దానభ్యాసపరజను లా[illegible]ెఱుఁగ । రరయ శుద్ధము బుద్ధము నై ప్రియంబు
చాలపూర్ణము నిష్ప్రపంచంబు మఱి ని । రామయంబగు నాత్మ యమ్యమూర్తి

36 శ్లో॥ నాప్నోతికర్మణామోక్షం । విమూఢోభ్యాసరూపిణా
ధన్యోవిజ్ఞానమాత్రేణ । ముక్తస్తిష్ఠత్యవిక్రియః॥

తే. కడఁగి యభ్యాసరూపమౌ కర్మములను । మూఢుఁడగువాఁడు పొందఁడు మోక్షమరయ
మహితధన్యుండు విజ్ఞాన మాత్రముననె । యేమొనర్పక ముక్తుఁడై యొసఁగునూవె

37 శ్లో॥ మూఢోనాప్నోతితద్బ్రహ్మ । యతోభవితుమిచ్ఛతి
అనిచ్ఛన్నపిధీరోహి । పరబ్రహ్మస్వరూపభాక్॥

తే. ఎంత గాఁ గోరి మీఱితము త్నింతమున్న । మూఢుఁడల బ్రహ్మరూపముఁ బొందలేఁడు
ఇచ్ఛలేకున్న ధీరుఁడై యొసఁగు జ్ఞాని । తాఁ బరబ్రహ్మరూపంబుఁ దాల్చుఁ గాదె!267

38శ్లో॥ నిరాధారాగ్రహవ్యగ్రా । మూఢాస్సంసారపోషకాః
ఏతస్యానర్థమూలస్య । మూలచ్ఛేదః కృతో బుధైః॥
తే. పట్టులేనిదురాగ్రహావటిమగల్గు । మూఢుఁడయ్యెడిసంసార పోషకుండె
పోనులన్ని యీసంసార మందలివని । జ్ఞానులడుగంటనఱికిరి కాదెదీని! 268
39శ్లో॥ నశాంతింలభతేమూఢో । యతశ్శమితుమిచ్ఛతి
ధీరస్తత్త్వంవినిశ్చిత్య । సర్వదాశాంతమానసః॥
తే. ఎంతశాంతింపమనమున నెంచియైన । మూఢుఁడెప్డును శాంతిని బొందలేఁడు
ధీరుఁడగుజ్ఞానితత్త్వంబుఁ దెలిసినమ్మి।సర్వదా శాంతమనమున సర్విఁ జెలఁగు.269
40శ్లో॥ క్వాత్మనోదర్శనంతస్య । యద్దృష్టమవలంబతే
ధీరాస్తంతంనపశ్యంతి । పశ్యంత్యాత్మానమవ్యయం॥
తే. కనఁగనైనదెల్లఁ గనినమ్మువానికి । ఆత్మరూపమెట్లు లగపడెడిని
జ్ఞానులెప్రుడుఁగనరు దీనినిదానిని । అరసికందురక్షయాత్మ మెుక్కఁడె. 270
41శ్లో॥ క్వనిరోధోవిమూఢస్య । యోనిర్బంధంకరోతివై
స్వారామస్యైవధీరస్య । సర్వదాఽసావకృత్రిమః॥
తే. పూనినిర్బంధ మొనరించు మూఢునకును । ఏడఁజిత్తనిరోధంబు కూడివచ్చు
అరయనాత్మాభిరాముఁడై యలరుజ్ఞాని । కెల్లెడలసహజమై యొనయుఁగాక.
42శ్లో॥ భావస్యభావకఃకశ్చి । న్నకించిద్భావకోఽపరః
ఉభయాభావకఃకశ్చి । దేవమేవనిరాకులః॥
తే. తానుగనునదితక్కినపఁ బూనునొకఁడు।ఉన్నదియునున్న చుట్టుచు నుండుఁబరుఁడు
ఇదియునదియునువ్యాదిలోనఁ గుదురనీని।యుత్తముండొండెనిశ్చల చిత్తుఁడగును.272
43శ్లో॥ శుద్ధమద్వయమాత్మానం । భావయంతికుబుద్ధయః
నతుజానంతిసమ్మోహా । ద్యావజ్జీవమనిర్వృతాః॥
తే. అమలమద్వయమంచునే యాత్మనెప్రుడుఁ।దలఁచుచుండ్రుకుబుద్ధులీ ధరణియందుఁ
గానివ్యామోహమునదానిఁ గానలేరు। బ్రదికినన్నాళ్లసంతోష పదమెలేక.273
44శ్లో॥ ముముక్షోర్బుద్ధిరాలంబ । మంతరేణనవిద్యతే
నిరాలంబైవనిష్కామా । బుద్ధిర్ముక్తస్యసర్వదా॥
ఆ. ముక్తిఁగోరువాని బుద్ధిపట్టునుగోరి । కానసూనుదేది సేనిగాని
ముక్తుఁడైనజ్ఞాని బుద్ధికోర్కెయొకేమి।అచలమగుచుఁగాంచు నాత్మనెప్రుడు

45శ్లో॥ విషయద్వీపినోవీక్ష్య । చకితాశ్శరణార్థినః
విశంతిఝటితిక్రోడం । నిరోధైకాగ్రసిద్ధయే॥

తే. విషయశార్దూలములఁగాంచి వెఱచిపఱచి । ఆత్మరక్షణకై చొత్తు రల్లగుహల
తమకుఁజిత్తనిరోధమం దమరుననుచు। మందబుద్ధులుజ్ఞానిదా చందమగునె? 275

46శ్లో॥ నిర్వాసనంహరిందృష్ట్వా । తూష్ణీంవిషయదంతినః
పలాయంతేనశక్తాస్తే । సేవంతేకృతచాటవః॥

తే. వాసనారహితునివారి కైశరిఁగని । విషయహస్తులశక్తత వెఱచిపఱచు
అల్ల వేదవ్వననునిల్చి యమ్మహాత్ము । వరుససేవించుఁగదప్రియ వాదులట్లు.276

47శ్లో॥ నముక్తికారికాంధత్తే । నిశ్శంకోయుక్తమానసః
పశ్యన్శృణ్వన్స్పృశన్జిఘ్రన్ । నశ్నన్నాస్తేయథాసుఖం॥

తే. అచలమనముండియుఁగసంశయంబులేని । జ్ఞానియమనియమాదుల నూనఁబోఁడు
కనుచువినుచునుదినుచుమూర్కొనుచుస్పృశ్యఁగొనుచుస్వేచ్ఛనుసుఖముగ మనెడి
నెపుడు. 277

48శ్లో॥ వస్తుశ్రవణమాత్రేణ । శుద్ధబుద్ధిర్నిరాకులః
నైవాచారమనాచార । మౌదాస్యంవాప్రపశ్యతి॥

తే. పటిమచెడనానెవస్తుశ్రవణముచేత । అమలమతియైనజ్ఞానిని రాకులుఁడగు
కనఁడనాచారమాచార మునువియును।ఇంకనౌదాస్యమైనని శ్యంకఁడగుచు.278

49శ్లో॥ యదాయత్కర్తుమాయాతి । తదాతత్కురుతేబుజుః
శుభంవాప్యశుభంవాపి । తస్యచేష్టాహిబాలవత్॥

తే. ఎప్పుడేయదిచేయంగ నొప్పునప్పు। డద్దిచేసెడిఁబాశ్రద్ధ మంచునెంచి
శుభమదియొయానొమతియద శుభమెయానొ। బాలురకుసాటిచేష్టల పట్లనతఁడు.

50శ్లో॥ స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి । స్వాతంత్ర్యాల్లభతేపరం
స్వాతంత్ర్యాన్నిర్వృతింగచ్ఛే। త్స్వాతంత్ర్యాత్పరమంపదం॥

తే. తగుసుసుఖమెల్లెడలనుస్వాతంత్ర్యమునను।తగుపరంబునుదొరకుస్వాతంత్ర్యమునను
అరయస్వాతంత్ర్యమునఁగూడ్చుఁ బరమసుఖము। పరగుస్వాతంత్ర్యమునఁగాడఁ
బరమపదము. 280

51శ్లో॥ అకర్తృత్వమభోక్తృత్వం । స్వాత్మనోమన్యతేయదా
తదాక్షీణాభవంత్యేవ । సమస్తాశ్చిత్తవృత్తయః॥

తే. తనయకర్తృతయును మతి తనయభోక్తృ। తయును మదిలోన నెప్పుడు తలఁచు
నపుడె హానియాచిత్తవృత్తులు వరుసనన్ని। త్రైణ్యమును బొందువాఁడగ్ర గణ్యుఁ
డుగను. 281

52శ్లో॥ ఉచ్ఛృంఖలాప్యకృతి కా। స్థితిర్ధీరస్య రాజతే
నతుసస్పృహచిత్తస్య। శాంతిర్మూఢస్యకృత్రిమా॥

తే. నిస్పృహుండగు ధీరుని నిజగుణంబుఁ। జూడ స్వేచ్ఛ నెసంగిన శోభఁ జెందు
సస్పృహుండగు మూఢుని శాంతగుణమె। కల్పితింబాటశోభను గానఁజెందు. 282

53శ్లో॥ విలసంతి మహాభోగై। ర్విశంతి గిరిగహ్వరాన్
నిరస్తకల్పనాధీరా। అబద్ధాముక్తబుద్ధయః॥

తే. సక్తియేమాత్రమును లేని ముక్తబుద్ధు। లల్ల సంకల్పమే లేని యట్టి ధీరు
లొకపుడు వేళ మహాభోగ మొందియుండ్రు। గిరులవనములనొకవేళఁ దిరుగుచుండ్రు.

54శ్లో॥ శ్రోత్రియం దేవతాంతీర్థ। మంగనాం భూపతిం ప్రియం
దృష్ట్వాసంపూజ్యధీరస్య। నకాపిహృదివాసనా॥

తే. జ్ఞానియగువాఁడు ధర్మార్థ కాంక్షఁగనఁడు। శ్రోత్రియుని దేవుఁ దీర్థముఁ జూచి
మ్రొక్కుఁ। గామమున నెన్నఁడాతండు గనుఁగొనండు। సతిని ధరణీపతిని బ్రియ
హితుని సుతుని. 284

55శ్లో॥ భృత్యైఃపుత్రైఃకళత్రైశ్చ। దౌహిత్రైశ్చాపిగోత్రజైః
విహస్యధిక్కృతోయోగీ। నయాతివికృతింమనాక్॥

తే. పుత్రదౌహిత్రభృత్యకళత్రగోత్రి। జులు నదన్నెపుఁ బనిరసించి చూడనైన
జ్ఞానికేమాత్ర మేనివికారమున్నె?। మున్నె మోహముఁ బ్రాదిఁగోని యున్న మిన్న.

56శ్లో॥ సంతుష్టోపిన సంతుష్టః। ఖిన్నోపిన చ ఖిద్యతే
తస్యాశ్చర్యదశాంతాంతాం। తాదృశాఏవజానతే॥

తే. అనుభవింపఁడు సంతోషి యైయుముదము। ఖిన్నుఁడైయును దుఃఖము నెన్నఁ
డెపుడు। తలఁపనాతని వింతవిధంబులన్ని। అట్టిమహనీయుఁడైననే యరయఁజాలు.

57శ్లో॥ కర్తవ్యతైవసంసారో। నతాంపశ్యంతిసూరయః
శూన్యాకారానిరాకారా। నిర్వికారానిరామయాః॥

తే. క్షితిని శూన్యాకృతులు నిరాకృతులు నిర్వి। కారులు నిరామయులుఁ తాము గాన
సంగు ఘనులు తలఁచరు కార్యసంకల్పములను। అదియె యోగఁగదసంసారమును
తలఁపున. 287

58శ్లో॥ అకుర్వన్నపిసంక్షోభా । ద్వ్యగ్రస్సర్వత్రమూఢధీః
కుర్వన్నపితుకృత్యాని । కుశలోహినిరాకులః॥

తే. ఏపనిచేయకయున్మూఢుఁ డెల్లెడల । క్షోభనేకాగ్రచిత్తతఁ జూడఁబడుఁ
డు। నెరపరిజ్ఞానిపనులెల్ల నిర్వహించు । చుండినిశ్చలచిత్తుఁడై యుండుఁబుడమి 288

59శ్లో॥ సుఖమాస్తేసుఖంశేతే । సుఖమాయాతియాతిచ
సుఖంవక్తిసుఖంభుఙ్త్తే । వ్యవహారేపిశాంతధీః॥

తే. శాంతుఁడగుజ్ఞానివ్యవహార సరణినున్న । సుఖముగానుండునిద్రించు సుఖముగా
నె। సుఖముగావచ్చుఁబోవును సుఖముగానె । సుఖముగాఁబల్కుభుజియించు
సుఖముగానె. 289

60శ్లో॥ స్వభావాద్యస్యనైవార్తి । ర్లోకవద్వ్యవహారిణః
మహాహ్రద ఇవాక్షోభ్యో । గతక్లేశస్సుశోభతే॥

తే. వ్యవహరించెడిజ్ఞానికిఁ బ్రాకృతుగతి । నార్తిలేమఁగతక్లేశుఁ డగుచునైజ
మునను రొంపిడయును లేమి ఘనజలాశ్య । యంబువైఖరిశోభించు నమలపదవి 290

61శ్లో॥ నివృత్తిరపిమూఢస్య । ప్రవృత్తిరుపజాయతే
ప్రవృత్తిరపిధీరస్య । నివృత్తిఫలభాగినీ॥

తే. మూఢజనునినివృత్తియు ముక్తుఁడాతఁ । డగుటచేతఁబ్రవృత్తిగా నమభవమగుఁ
గానిజ్ఞానిప్రవృత్తియు నానివృత్తి । ఫలమెయొనగూర్చునతనిని శ్చలతబలిమి 291

62శ్లో॥ పరిగ్రహేషువైరాగ్యం । ప్రాయోమూఢస్యదృశ్యతే
దేహేవిగళితాశస్య । క్వరాగః క్వవిరాగతా॥

ఆ వలచువానియందు వైరాగ్యమెల్లెడఁ । గానఁబడునుమూఢ మానవునకు।
దేవనాసలేని జ్ఞానికెట్లుండు । రాగదశయువతివి రాగదశయు? 292

63శ్లో॥ భావనాభావనాసక్తా । దృష్టిర్మూఢస్యసర్వదా
భావ్యభావనయాసాతు । స్వస్థస్యాదృష్టిరూపిణీ॥

తే. మూఢదృష్టికినాసక్తి ముందునిలిచి । యెప్పుడునగునది కానిది యెంచుచుండు
స్వస్థుఁడగుజ్ఞానికాదృష్టి పోగఁ బోక । చూపడఁ గియుండుఁగొఱమాలి నేపునకు

64శ్లో॥ సర్వారంభేషునిష్కామో । యశ్చరేద్బాలవన్మునిః
నలేపస్తస్యశుద్ధస్య । క్రియమాణేపికర్మణి॥

ఆ. బాలునట్లుకామ పాశరహితమౌని । సర్వకార్యములను సలుపుచుండు
నైనఁబనులొనర్చు నప్డుగూర్పత్వ । మతనికుండదరయ నమలుఁడగుట 294

65శ్లో॥ సఏవధన్యఆత్మజ్ఞః । సర్వభావేషుయస్సమః
పశ్యన్ఛృణ్వన్స్పృశన్జిఘ్రి । న్నశ్నన్నిస్తర్షమానసః॥

ఆ. సర్వభావములను సముఁడైతఁడాతఁడే । ఆత్మవేత్తధన్యుఁ డయినవాఁడు। తనిసి
యుండుమదిని తాఁగనువినుస్పర్శ । గొనునుమూరుకొనును దినునిరతము 295

66శ్లో॥ క్వసంసారఃక్వచాభాసః । క్వసాధ్యంక్వచసాధనం
ఆకాశస్యేవధీరస్య । నిర్వికల్పస్యసర్వదా॥

ఆ. ఆకసంబువలెని యవికల్పుఁడౌజ్ఞాని । కేటికిప్రపంచ మిందలివరిధ
స్వర్గమైననేడ సాధ్యముగాఁగోరు । యజ్ఞసాధనంబు నరయునేడ? 296

67శ్లో॥ సజయత్యర్థసన్యాసీ । పూర్ణస్వరసవిగ్రహః
అకృత్రిమోఽనవచ్ఛిన్నే । సమాధిర్యస్యవర్తతే॥

ఆ. ఎవనినైజభావ మెన్నఁబూర్ణస్వరూ । పమునఁదగుసమాధి నమరియుండు
నతఁడెపూర్ణమూర్తి యర్థపరిత్యాగి। అన్నిటినిజయించి యెన్నికఁగను 297

68శ్లో॥ బహునాత్రకిముక్తేన । జ్ఞాతతత్త్వోమహాశయః
భోగమోక్షనిరాకాంక్షీ । సదాసర్వత్రనీరసః॥

ఆ. వేయిమాటలేటి కోయితత్త్వజ్ఞుఁడె । తామహాశయుండు తథ్యముగను
భోగమోక్షములను పొందఁగాఁగోరండె । యెప్పుడునువిరాగి యేయుగుఁగద 298

69శ్లో॥ మహదాదిజగద్ద్వైతం। నామమాత్రవిజృంభితం
విహాయశుద్ధబోధస్య । కింకృత్యమవశిష్యతే॥

ఆ. పంచభూతములని పరగుప్రపంచము । రెండటనెడి తెలివి బండచేసి
యుండఁజేయుజ్ఞాన ముప్పారునమలున। కొకపనియుఁజేయ నున్నమిగిలి? 299

70శ్లో॥ భ్రమభూతమిదంసర్వం । కించిన్నాస్తీతినిశ్చయీ
అలక్ష్యస్ఫురణశ్శుద్ధః । స్వభావేనైవశామ్యతి॥

ఆ. భ్రాంతిమాత్రమెదుటఁ బరగునదంతయు । నేమిలేదటంచు నెఱుఁగునతఁడు
శుద్ధుఁడగుటఁజిత్తె స్ఫురణను వెలుఁగుట । నైజమైనశాంతి తోఁజెలఁగడి 300

71శ్లో॥ శుద్ధస్ఫురణరూపస్య । దృశ్యభావమపశ్యతః
క్వవిధిఃక్వచవైరాగ్యం । క్వత్యాగఃక్వశమోపివా॥

ఆ. వెలఁగుస్వపరికాశ చిద్రూపియొన్నండుఁ । గానవచ్చుదానిఁ గనఁగొనందు
విధియతనికినేడ? విసవిరాగితయేదఁ । త్యాగమేడ? శాంతి యైననేడ? 301

72శ్లో॥ స్ఫురతోఽనంతరూపేణ । ప్రకృతించనపశ్యతః
క్వబంధఃక్వచవామోక్షః । క్వహర్షఃక్వవిషాదతః॥

ఆ. చెలఁగునఖిలరూప చిన్మూర్తియైనవాఁడుఁ । గార్యసహితమాయఁ గానకుండు
బంధమతనికేడఁ బరగుమోక్షంబేడ? । మోదమేడ? భయద ఖేదమేడ.? 302

73శ్లో॥ బుద్ధిపర్యంతసంసారే । మాయామాత్రంవివర్తతే
నిర్మమోనిరహంకారో । నిష్కామశ్శోభతేబుధః॥

తే. బుద్ధిపర్యంతసంసృతి భూషితుఁడయి । కల్పితంబగుజగము నాకారమొందు
బుధుఁడు మమతయహంకృతి పొందునొక్కొ! । కామమే లేక శోభించు ఘనుఁ
డతండు. 303

74శ్లో॥ అక్షయంగతసంతాప । మాత్మానంపశ్యతోమునేః
క్వవిద్యాచక్వవావిశ్వం । క్వదేహోఽహంమమేతివా॥

ఆ. క్షయవిరహితముగత సంతాపమగునాత్మ । ననవరతముఁ గనుఁ గనెడుమునికి
విద్యయనఁగ నేడ? విశ్వంబనఁగ నేడ? । మేను నేను నాది నాని యేడ?. 304

75శ్లో॥ నిరోధాదీనికర్మాణి । జహాతిజడధీర్యది
మనోరథాన్ప్రలాపాంశ్చ । కర్తుమాప్నోత్యతత్క్షణాత్॥

తే. ఎపుడు చిత్తనిరోధాదు లుపరమింప । నెంచునో మూఢుఁడా క్షణమే మొదలిడి
పలుమనోరథములు ప్రలాపములు వరుస । మదికిసంధించి కోఁజూచు మానవేమి. 305

76శ్లో॥ మందశ్శ్రుత్వాపితద్వస్తు । నజహాతివిమూఢతాం
నిర్వికల్పోబహిర్యత్నా । దంతర్విషయలాలసః॥

ఆ. మందుఁడాత్మవస్తు మాహాత్మ్యమును విన్న । నేమి! మౌఢ్యమతని నొడఁద విడదు
బయటియత్నమందుఁ బనులను మానిన । మనమునందు విషయ మమతపోదు. 306

77శ్లో॥ జ్ఞానాద్గళితకర్మాయో । లోకదృష్ట్యాపికర్మకృత్
నాప్నోత్యవసరంకర్తుం । వక్తుమేవనకించన॥

ఆ. జ్ఞానమున గళిత కర్ముఁడౌ నాతండు । కనఁగఁ బనులు సేయ ననువొనరిన
మునుపటియొనర్ప నింతయు వచియింప । నవసరంబు పొందఁ డచ్చెరువగు. 307

78శ్లో॥ క్వతమఃక్వప్రకాశోవా । హానంక్వచనకించన
నిర్వికారస్యధీరస్య । నిరాతంకస్యసర్వదా॥

ఆ. ఎల్లవేళలందు నేభయమును లేక । మఱివికృతియు లేక మనెడి జ్ఞాని
కంధకారమేడ? ప్రకాశంబేడఁ? । త్యాగమేడ? యేది యైన లేదు. 308

79శ్లో॥ క్వధైర్యంక్వవివేకిత్వం । క్వనిరాతంకతాపివా
అనిర్వాచ్యస్వభావస్య । నిస్స్వభావస్యయోగినః॥

ఆ. నిర్వచింపరాని నిజగుణమొప్పస్వ । భావరహితుఁడైన పరమయోగి
కేడధైర్యముండు? నేడవివేకిత్వ? । మేడనుండుభీతి యెఱుఁగఁ డునికి?. 309

80శ్లో॥ నస్వర్గోనైవనరకో । జీవన్ముక్తిర్నచైవహి
బహునాత్రకిముక్తేన । యోగదృష్ట్యానకించన॥

ఆ. స్వర్గనరకములును వరలుజీవన్ముక్తి । యైనలేదుజ్ఞాని యైనవాని
కిచటవేయిచెప్ప నేమిటి?కలయోగ । దృష్టినేమిలేదు స్పష్టమిదియె. 310

81శ్లో॥ నైవప్రార్థయతేలాభం । నాలాభేనానుశోచతి
ధీరస్యశీతలంచిత్త । మమృతేనైవపూరితం॥

ఆ. ధీరుఁడైనవాని దివ్యచిత్తంబెన్న । నమృతమయమగుఁజల్ల నైనదియును
లాభమాసపడఁడు లభ్యముకాకున్నఁ । జింతసేయఁడిదియె వింతకాదె! 311

82శ్లో॥ నశాంతంస్తౌతినిష్కామో । నదుష్టమపినిందతి
సమదుఃఖసుఖస్తృప్తః । కించిత్కృత్యంనపశ్యతి॥

ఆ. శాంతుఁడనుచునొకని సంస్తుతిసేయండు । దుష్టుఁడనుచునొకని దూఱఁబోఁడు
సౌఖ్యదుఃఖములను సముఁడగుఁదృప్తుఁడౌ । నెదియుఁజేయఁగానఁ డిచ్ఛలేమి.

83శ్లో॥ ధీరోనద్వేష్టిసంసార । మాత్మానంనదిదృక్షతి
హర్షామర్షవినిర్ముక్తో । నమృతోనచజీవతి॥

ఆ. పరమయోగిద్వేష పడఁడుసంసారము । పూనియాత్మనైనఁ గానఁబోఁడు
ముదమదోషములను మొదలంటవిడనాడి।చావకుండుబ్రదుకఁ జాలకుండు. 313

84శ్లో॥ నిస్స్నేహఃపుత్రదారాదౌ । నిష్కామోవిషయేషుచ
నిశ్చింతస్స్వశరీరేఽపి । నిరాశశ్శోభతేబుధః॥

ఆ, జ్ఞానిసుతులనాలి నైనఁబ్రేమింపఁడు । విషయములనుగామ విరహితుఁడగు
తనయొడలికైనఁ బొనరింపఁడేచింత । ఆసయెదియులేక యలరుచుండు. 314

85శ్లో॥ తుష్టిస్సర్వత్రధీరస్య । యథాపతితవర్తినః
స్వచ్ఛందంచరతేదేశా । న్యత్రాస్తమితశాయినః॥

ఆ. ప్రాప్తదశలఁబట్టి వర్తించుజ్ఞానికి । నెల్లయెడలదృష్టి కొల్లకొల్ల
ఏడఁబొద్దుగ్రుంకు నాడనిద్రించుచుఁ । దిరుగువాంఛలేక దేశములను. 315

86 శ్లో॥ పతతూదేతు వాదేహో । నాస్యచింతా మహాత్మనః
స్వభావభూమివిశ్రాంతి । విస్మృతాశేష సంసృతేః॥

ఆ. ఆత్మభావభూమి హాయిగ విరమించి । మాయసంసృతులను మఱచునట్టి
ఆమహామహునకు నంగంబు మరణింప । నైన బ్రదుకనైన నగునె చింత. 316

87 శ్లో॥ అకించనః కామచారో । నిర్ద్వంద్వశ్ఛిన్న సంశయః
అసక్తస్సర్వభావేషు । కేవలో రమతే బుధః॥

ఆ. బుధుఁడకించనుండు పుడమిఁ జరించును । సౌఖ్యదుఃఖభేద సంశయములు
సర్వభావములను సక్తియు లేకుండు । వికృతిలేక ముదము వెలయనుండు. 317

88 శ్లో॥ నిర్మమశ్శోభతే ధీరః । సమలోష్టాశ్మకాంచనః
సుభిన్న హృదయగ్రంధి । ర్వినిర్ధూత రజస్తమః॥

ఆ. జ్ఞాని మమత లేక కాంచనలోష్టము । లొసమతఁ జూచియహముఁ జక్కనలికి
తమము రాజసంబు లతిఁగి పోఁగడిగియు । శోభఁ జెందియుండు శుద్ధుఁడగుచు. 318

89 శ్లో॥ సర్వత్రానవధానస్య । నకించిద్వాసనా హృది
ముక్తాత్మనో వితృప్తస్య । తులనా కేన జాయతే॥

తే. ఎప్పుడు వైరాగ్యచిత్తంబె యొప్పఁగనుండు । జ్ఞానియించుక వాసన కనఁడు హృదిని
కర్తృతత్వము మాఁదృప్తిని ఘనముగఁ గను । నతనికీడైనవాఁ డున్నె యవనియందు?

90 శ్లో॥ జానన్నపి న జానాతి । పశ్యన్నపి న పశ్యతి
బ్రువన్నపిచ న బ్రూతే । కోఽన్యో నిర్వాసనాదృతే॥

ఆ. వాంఛలేని జ్ఞాని వలెనెవ్వఁడిలనున్నె? । యెఱుఁగునట్టియుండు నెఱుఁగఁ డేదియు
కాంచునట్టియుండుఁ గనుఁగొనఁడేదియుఁ । బలుకునట్టియుండుఁ బలుకఁడేదియు.

91 శ్లో॥ భిక్షుర్వా భూపతిర్వాపి । యో నిష్కామస్స శోభతే
భావేషు గళితా యస్య । శోభనాశోభనా మతిః॥

ఆ. తలఁపులందు బుద్ధి యలరుచుఁ దలఁగుచు । నుంటమాను వెతని మర్త్యుసేతఁ
దగువకామఁడాతఁ డారయ భిక్షువె । రైన నృపతియైన నందు శోభ. 321

92 శ్లో॥ క్వస్వాచ్ఛంద్యం క్వసంకోచః । క్వవా తత్త్వవినిశ్చయః
నిర్వ్యాజార్జవభూతస్య । చరితార్థస్య యోగినః॥

ఆ. నిష్కపటసరళ నియమసంఘటితార్థ । యుక్తిగలుఁగు యోగి కొకటనున్నె?
అలస్వతంత్రతయుని కడఁగనిసంకోచ । ముల్లతత్త్వమందు నమరరూఢి. 322

93 శ్లో॥ ఆత్మవిశ్రాంతితృప్తేన । నిరాశేన గతార్తినా
అంతర్యదనుభూయేత । తత్కథం కస్య కథ్యతే॥

తే. ఆత్మవిశ్రాంతిచేఁ దృప్తి నందియుండి । ఆసయును దుఃఖమును లేక యలరుజ్ఞాని
హృదయమనుభవమును బొంది సదమలమగు । నద్దియెట్టుల నెవనికి నగుఁ దెలుపఁగ?

94 శ్లో॥ సుప్తోపి న సుషుప్తౌ చ । స్వప్నేపి శయితో న చ
జాగరేపి న జాగర్తి । ధీరస్తృప్తః పదే పదే॥

ఆ. నిదురవోవకుండు నిద్దురఁ జెందుచుఁ । బడక లేదు కలలు వడయునైన
మేలుకొనఁగ నందు మెలఁకువ యుండదు । ధీరుఁ డెల్లయెడలఁ దృప్తుఁ డెందు. 324

95 శ్లో॥ జ్ఞః సచింతోపి నిశ్చింతః । సేంద్రియోపి నిరింద్రియః
సుబుద్ధిరపి నిర్బుద్ధిః । సాహంకారోఽనహంకృతిః॥

ఆ. జ్ఞాని చింత సేయుఁ గాని నిశ్చింతుఁడు । ఇంద్రియరహితుఁ డగు సేంద్రియుఁడయి
బుద్ధి గొనఁగునైన బుద్ధి లేకుండున । హంకృతి కలిగియును హంకృతియగు. 325

96 శ్లో॥ న సుఖీ న చ వా దుఃఖీ । న విరక్తో న సంగవాన్
న ముముక్షుర్న వా ముక్తో । న కించిన్న చ కించన॥

ఆ. జ్ఞానియైనయతఁడు కాఁడయ్య సుఖిదుఃఖి । రక్తి కలయతఁడు విరక్తుఁడునిఁక
మఱి ముముక్షువల్ల మహితుఁడౌ ముక్తుండు । ఎన్నఁగొలఁది కాఁడిఁక కేమి కాఁడు.

97 శ్లో॥ విక్షేపేపి న విక్షిప్తః । సమాధౌ న సమాధిమాన్
జాడ్యేపి న జడో ధన్యః । పాండిత్యేపి న పండితః॥

తే. చిత్తవిక్షేపమునను విక్షిప్తుఁ డనఁగ । నొగి సమాధి సమాధిసంయుతుఁ డనంగ
జాడ్యమందల ధన్యుండు జడుఁ డనంగఁ । బాండితిని బండితుఁ డనంగఁ బడఁడు సూవె

98 శ్లో॥ ముక్తో యథాస్థితిస్వస్థః । కృతకర్తవ్యనిర్వృతః
సమస్సర్వత్ర వైతృష్ణ్యా । న్న స్మరత్యకృతం కృతం॥

ఆ. ప్రాప్తమైనయునికి స్వస్థుఁడౌ ముక్తుండు । చేయఁ జేయనున్న హాయిగమను
సర్వసముఁడతండు సలిపినదటు కాని । దరయఁబోవఁడేమి యాస లేమి. 328

99 శ్లో॥ న ప్రీయతే వంద్యమానో । నింద్యమానో న కుప్యతి
నైవోద్విజతి మరణే । జీవనే నాభినందతి॥

ఆ. మ్రొక్కి కొనారటంచు మక్కువఁ జెందండు । కోపపడఁడు నింద మోపిరనుచు
చావునకును హృదిని నోవఁడు చెదరఁడు । బ్రదుక మోదపడఁడు పరమయోగి. 329

100 శ్లో॥ నథావతిజీనాకీర్ణం । నారణ్యాముపశాంతధీః
యథాతథాయత్రతత్ర । సమయేవావతిష్ఠతే॥

ఆ. శాంతచిత్తుఁడైన జ్ఞానిపురములకు । నడవులకునుబరువు లిడఁగఁబోక
ఎటులొయటులెయెయటనో యటనెకాలానుసా। రముగనిలుచుపట్టి భ్రమలుమాని.

ఏకోనవింశప్రకరణము.

ఆత్మవిశ్రాంత్యష్టకము.

1 శ్లో॥ తత్త్వవిజ్ఞానసందంశ । మాదాయహృదయోదరాత్
నానావిధపరామర్శ । శల్యోద్ధారఃకృతోమయా॥

ఆ. మాననీయనీదు జ్ఞానోపదేశమనె । బట్టుకారుచేతఁ బట్టిహృదయ
మందునుండిసంశ యములనుశల్యంబు । లూడఁ బెఱుకఁగలిగి నాఁడఁగురుఁడ! 331

2 శ్లో॥ క్వధర్మఃక్వచవాకామః । క్వచార్థఃక్వవివేకితా
క్వద్వైతంక్వచవాద్వైతం । స్వమహిమ్నిస్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కేడధర్మ?మర్థ మేడఁ?గామ
మెచట?దెలివియెచట? నెచటనద్వైతము? । ద్వైతమేడఁ?జూడరోఁతపూడ

3 శ్లో॥ క్వభూతంక్వభవిష్యద్వా । వర్తమానమపిక్వవా
క్వదేశఃక్వచవానిత్యం । స్వమహిమ్నిస్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కేడభూతకాల? మేడభావి
కాల?మేడజరుగు కాలము?దేశంబు । నేడనెటననిత్య మెంచిచూడ? 333

4 శ్లో॥ క్వచాత్మాక్వచవానాత్మా । క్వశుభంక్వాశుభంతథా
క్వచింతాక్వచవాఽచింతా । స్వమహిమ్నిస్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కాత్మయెట?యనాత్మ యనఁగనెచట
శుభము నేడ?మఱియు శుభమనఁగా నేడఁ? జింతసేయు టెటన చింతయెచట? 334

5 శ్లో॥ క్వస్వప్నఃక్వసుషుప్తిర్వా । క్వచజాగరణంతథా
క్వతురీయంభయంవాపి । స్వమహిమ్నిస్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కేడస్వప్న?మింక నెటసుషుప్తి?
ఎచటజాగరణము నేఁబొందియుండుట? । పటుతురీయ మేడ? భయము నేడ? 335

6 శ్లో॥ క్వదూరంక్వసమీపంవా । బాహ్యంక్వాభ్యంతరంక్వవా
క్వస్థూలంక్వచవాసూక్ష్మం । స్వమహిమ్నిస్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కేదదూర?మరయ నేదదాఁపు?
బయలు నేద?లోని భాగంబనఁగ నేద? । స్థూలమేదఁ?జూడ సూక్ష్మమేద? 336

7 శ్లో॥ క్వమృత్యుర్జీవితం వాక్వ । లోకాః క్వాస్య క్వలౌకికం
క్వలయః క్వసమాధిర్వా । స్వమహిమ్ని స్థితస్యమే॥

ఆ. నాదుమహిమయందుఁ బాదుకొన్నట్టినా । కేడఁ జావు? మనికి యేడఁ జూడ?
జగము లేడ? వాని జాడలనఁగ నేడ? । మతిలయంబు నెట? సమాధి యెచట? 337

8 శ్లో॥ అలంత్రివర్గకథయా । యోగస్యకథయాప్యలం
అలంవిజ్ఞానకథయా । విశ్రాంతస్యమమాత్మని॥

ఆ. వెలయు నాత్మయందు విశ్రాంతిఁగను నాకుఁ । గల త్రివర్గ విషయ కథలు చాలు
ఘనములైన యోగ కథలును జాలును । బుధులెఱుంగు జ్ఞాన కథలుఁ జాలు. 338

## వింశ ప్రకరణము.

### శిష్యప్రోక్త జీవన్ముక్తి చతుర్దశకము.

1 శ్లో॥ క్వభూతాని క్వదేహో వా । క్వేంద్రియాణి క్వవా మనః
క్వశూన్యం క్వచ నైరాశ్యం । మత్స్వరూపే నిరంజనే॥

ఆ. అల నిరంజనుండనై యలరెడి నాకు । నేడ భూతచయము? నేడ మేను?
ఇంద్రియంబు లేడ? నెక్కడను మనంబు? । శూన్యమేడ? నాస లేమి యేడ? 339

2 శ్లో॥ క్వశాస్త్రం క్వాత్మవిజ్ఞానం । క్వవా నిర్విషయం మనః
క్వతృప్తిః క్వవితృష్ణత్వం । గతద్వంద్వస్యమే సదా॥

ఆ. అల్ల రెండు లేక యలరెడి నాకెప్డు । నేడ శాస్త్ర?మాత్మ మెఱుఁగు టేడ?
విషయరహితమగుచు వెలయు మనంబేడఁ? । దనియు టేడఁ? దనియ కునికి యేడ?

3 శ్లో॥ క్వవిద్యా క్వచ వావిద్యా । క్వాహం క్వేదం మమ క్వవా
క్వబంధః క్వచ వా మోక్షః । స్వరూపస్య క్వరూపితా॥

ఆ. నిర్విశేషరూపి నేఁగద; విద్యయు । విద్య యహము నిద్ది విసఁగ నాది
బంధమోక్షములును బటుధర్మవార్తయు । నేది మాత మన్న నేడ నయ్య? 341

4 శ్లో॥ క్వప్రారబ్ధాని కర్మాణి । జీవన్ముక్తిరపి క్వవా
క్వతద్విదేహకైవల్యం । నిర్విశేషస్య సర్వదా॥

తే. నిర్విశేషస్వరూపినై నిత్యముండు । నాకుఁ బ్రారబ్ధ కర్మంబు లేకడఁ దగుఁ?
అరసి చూడ జీవన్ముక్తి యైన నేడ? । నల విదేహకైవల్యంబు నందు టేడ? 342

5 శ్లో॥ క్వకర్తాక్వచవాభోక్తా । నిష్క్రియంస్ఫురణంక్వవా
క్వాపరోక్షంఫలంవాక్వ । నిస్స్వభావస్యమేసదా॥

ఆ. నిర్గుణుండనగుచు నిచ్చలు నేనుందు । కర్తయెడ? భోక్త కలిమియెడ?
ఎచటనిష్క్రియత్వ? మెచ్చటస్ఫురణంబు? । ఎచ్చటనపరోక్ష? మెచటఫలము?

6 శ్లో॥ క్వలోకఃక్వముముక్షుర్వా । క్వయోగీజ్ఞానవాన్క్వవా
క్వబద్ధఃక్వచవాముక్తః । స్వస్వరూపేహమద్వయే॥

ఆ. అద్వయాత్మరూప మందియేనుందుదు నెటముముక్షు? వెన్న నేడజగము?
యోగియెచట? జ్ఞాన యుక్తుండనగ నేడ?। మోహబద్ధుడేడ? ముక్తుడేడ? 344

7 శ్లో॥ క్వసృష్టిఃక్వచసంహారః। క్వసాధ్యంక్వచసాధనం
క్వసాధకఃక్వసిద్ధిర్వా । స్వస్వరూపేహమద్వయే॥

ఆ. అద్వయాత్మరూప మందియేనుందుదు । నెచటసృష్టి? యరయ నేడలయము
సాధ్యమనగ నేడ? సాధనం బేడను?। ఏడసాధకుండు? కేడసిద్ధి? 345

8 శ్లో॥ క్వప్రమాతాప్రమాణంవా । క్వప్రమేయంక్వచప్రమా
క్వకించిత్క్వనకించిద్వా । సర్వదావిమలస్యమే॥

తే. నిచ్చలమలస్వరూపినై నెగడునాకు । నెటప్రమాత? ప్రమాణంబు నేడగలదు?
ఎటప్రమేయము? ప్రమయుందా నేడగలదు?। ఏడకించి! త్తకించిత్తు నేడజూడ?

9 శ్లో॥ క్వవిక్షేపఃక్వచైకాగ్ర్యం । క్వనిర్బోధఃక్వమూఢతా
క్వహర్షఃక్వవిషాదోవా । సర్వదానిష్క్రియస్యమే॥

తే. ఎప్పుడేపనియును లేక యొసగునాకు । నేడవిక్షేప? మైకాగ్ర్య మేడనప్పు?
ఏడమూఢత? నిర్బోధ మేడజూడ?। హర్ష మేడ? విషాదంబు నందు లేడ? 347

10 శ్లో॥ క్వచైషవ్యవహారోవా । క్వచసాపరమార్థతా
క్వసుఖంక్వచవాదుఃఖం । నిర్విమర్శస్యమేసదా॥

ఆ. ఏవిమర్శ లేక యొప్పుదునగునాకు । వ్యావహారికంబు లరయ నేడ?
పరగుచుండునట్టి పారమార్థిక మేడ?। సుఖముదుఃఖ మేడ జూడజూడ? 348

11 శ్లో॥ క్వమాయాక్వచసంసారః । క్వప్రీతిర్విరతిఃక్వవా
క్వజీవఃక్వచతద్బ్రహ్మ । సర్వదావిమలస్యమే॥

ఆ. అనవరతము నిర్మలాత్ముడనగునాకు । మహితసంసృతియును మాయయేడ?
ప్రీతియేడ? విరతి రీతియు నేడను? జీవుడేడ? బ్రహ్మ భావమేడ? 349

12 శ్లో॥ క్వప్రవృత్తిర్నివృత్తిర్వా । క్వముక్తిఃక్వచబంధనం
కూటస్థనిర్విభాగస్య । స్వస్థస్యమమసర్వదా॥

తే. పరఁగఁగూటస్థిరాఖండ భాగుఁడనయి। యనవరతమును స్వస్థుఁడ నైననాకు
ఏడనుండుఁబ్రవృత్తి? నివృత్తియేడ?। ముక్తియేడను? బంధసంయుక్తియేడ? 850

13 శ్లో॥ క్వోపదేశఃక్వవాశాస్త్రం । క్వశిష్యఃక్వచవాగురుః
క్వచాస్తిపురుషార్థోవా । నిరుపాధేశ్శివస్యమే॥

తే. అరయనిరుపాధిక శివుఁడ నైననాకు । శాస్త్రమెక్కడ? నుపదేశ సంజ్ఞయెచట
శిష్యుఁడననేడ? గురుఁడొండుచెలఁగుటేడఁ?। బరఁగుచుండెడి పురుషార్థ పదవులేడ?

14 శ్లో॥ క్వచాస్తిక్వచవానాస్తి । క్వాస్తిచైకంక్వచద్వయం
బహునాత్రకిముక్తేన । కించిన్నోత్తిష్ఠతేమమ॥

ఆ. ఏడనున్నదనుట? యెచటలేదనుటయు? । నేడఁదగునొకండు? నెందురెండు?
వేయిపలుకనేల? వివరింపనించుకేఁ । బ్రతిభ లేదు నాకు నతులితునకు. 852

ఏకవింశ ప్రకరణము.

సంఖ్యాక్రమ వ్యాఖ్యానము.

1 శ్లో॥ దశషట్సోపదేశేస్యుః । శ్లోకాశ్చపంచవింశతిః
సత్యాత్మానుభవోల్లాసే । ఉపదేశేచతుర్దశ॥

తే. ఆదినుపదేశమునఁబది యాఱుగలవు । ఎన్న నాత్మానుభవమున నిర్వదైదు
ఓలినుపదేశమునఁబదు నాలుగమఱఁ । జూడనుల్లాసములుమూఁట శ్లోకములివి

2 శ్లో॥ షడుల్లాసేలయేచైవ । ఉపదేశేచతుశ్చతుః
పంచకంస్యాదనుభవే । బంధమోక్షేచతుష్కకం॥

తే. అనుభవోల్లాసమందలి వాఱునాల్గు । నాలుగుపదేశములరెంట నోలిననమరు
మరలననుభవమున నైదు మహితబంధ । మోక్షమున నాల్గుశ్లోకము ల్మద్దుఁగఁదగు

3 శ్లో॥ నిర్వేదోపశమేజ్ఞానే । ఏవమేవాష్టకంభవేత్
యథాసుఖేసప్తకంచ । శాంతౌస్యాద్వేదసమ్మితం॥

తే. అమరునిర్వేదమందుప శమమునందు । జ్ఞానమందేకమేవయు స్వంజ్ఞ నెనిమి
దేసియుయథాసుఖంబున నేడుశాంతి । శ్లోకముల్నాలుగొప్పును సొంపుగాను.

4 శ్లో॥ తత్త్వోపదేశేవింశచ్చ । దశజ్ఞానోపదేశకే
తత్త్వస్వరూపేవింశచ్చ । శమేచశతకంభవేత్॥

2-0-0 వేమనసూక్తిరత్నాకరము (403: నిర్దుష్టపద్యములును బొమ్మలుగల చరిత్రయు)
2-0-0 పురుషోత్తమకవీయము (శబ్దప్రకృతి వికృతిరూపాంతరములఁ దెల్పు నిఘంటువు)
1-8-0 అద్భుతోత్తరరామాయణము (సహస్రముఖరావణవధ. అద్భుతకవిత్వముగలది.)
1-0-0 గురుభక్తిప్రభావము (ముద్దుకుకథ, సీతులపుట్టి, కడుసులభశైలి ప్రబంధము)
0-12-0 కృష్ణానదీమాహాత్మ్యము (వింతయుపాఖ్యానములుచాలగలమనోహరప్రబంధము)
0-12-0 కుసంగేశ్వరచరిత్రము (వింతకథ చక్కనిశైలిగల యొకప్రబంధము)
0-12-0 చంద్రహాసచరిత్రము (10 అంకములనాటకము, పద్యగద్యాత్మకములు సులభశైలి)
0-12-0 ద్రౌపదీవస్త్రాపహరణము (భారతకథానాటకము, కీర్తనలు పద్యములు రమ్యములు)
0-12-0 హిందుస్థానీ రామదాసచరిత్రము (తెలుగులిపి, అపూర్వనాటకము, చాలఁ దేలిక)
0-10-0 ప్రసంగవదనహరిశ్చంద్రనాటకము (జాతీయములుగలది, క్రొత్తయచ్చు)
0-8-0 ధార్మికోల్లాసిని (ఒక ధార్మికునివిల్లువదచ్చరిత్రయు, తేలికశైలిపద్యకావ్యము)
0-8-0 ఆంధ్రీకృతాష్టావక్రగీతలు (వేదాంతసారసంగ్రహము, శ్లోకములనుగీతములును)
0-8-0 యూదవాద్రీశోపాఖ్యానము (బీబీనాంచారు పెండ్లికథ, మిక్కిలి తేలికశైలి)
0-6-0 స్త్రీలమీటింగునాటి హరికథ (జగత్ప్రసిద్ధము, కొద్దిప్రతులేయున్నవి)
0 6 0 సోమేశ్వరీయము (వివిధవృత్తములు చిత్రకవిత్వముగల చాటుప్రబంధము)
0 6-0 మహేంద్రపురాణము (మూసివాయనములనోముకథ, చిన్నప్రబంధము)
0-6-0 అద్భుతోత్తరరామాయణ తృతీయాశ్వాసము (1911 సం॥ B.. A టెక్స్టు)
0-6 0 వేమనయోగీంద్రచరిత్రము (చిత్రపటములుగల తేటతెలుఁగు వచనకావ్యము)
0 5-0 అంకజ్యోత్స్న (700 యుక్తిలెక్కలుగలది, బహుప్రసిద్ధమయినది.)
0 5 0 [illegible] లెక్కల పుస్తకము (60 ఎగ్జామినేషన్ పేపర్సుగలది)
0-3 0 అజ్ఞానధ్వంసిని (మాతాపితృసేవర్ణనము, దేవతాప్రార్థనముంగలది)
0 3-0 చెన్నపురి రాజధాని భూగోళము (జిల్లాలమ్యాప్పులు దర్శిలాది)
0-2-0 సౌఖ్యవిషయగుచ్ఛము (బహుప్రసిద్ధమైనసంగ్రహపు హైజీను)
0-2-0 చిన్నతరగతుల లెక్కల పుస్తకము (అంకజ్యోత్స్న 1 వ భాగము)
0-2-0 అక్షరాభ్యాసము (అక్షరములును గుణితమును వేగముగ రాపీలైనది)
0 2 0 ముక్తికాంతామణిశతకము (పార్థనాశ్లోకములుమలోకోక్తులుగలపద్యములును)
0 2-0 సర్వమతభక్తానుకూలకీర్తనావళి (చక్కనివింతమట్లుగలది, క్రొత్తపద్ధతి)
0-1 0 కీర్తనలు, హారతులు, పాటలు (పాడుకొనుటకుఁ భావాంతరములుంగలవి)
0-1 0 మనోహరసోమేశ్వరశతకము (108 పసందైనసీసపద్యములుగలది)
0-1-0 పూర్వకగ్నశతకము (రామాయణభారతాది గ్రంథాంశములు, మాచితీలవలెను)
0-1-0 జార్జిప్రభు పట్టాభిషేకము (వివిధవృత్తకలసితము)

చిరునామా.  నాదెళ్ల పురుషోత్తముఁడు.

మచిలీపట్టణము.

---